మ॥ కలసౌందర్యసమస్తమేక మయి యాకంజాక్షి యామాదిరిన్
గళలన్ జిమ్మెడి దర్శనీయవిమలాకారానకున్ దోఁడు ని
స్తులమౌ కాంచనభూషణాళి వెలదుస్తుల్ శ్రీవియుం బొల్చి ప్రద
ష్టల దిగ్భ్రాంతులఁ జేయుచున్న దగు చంచద్రూప యాబాలికన్

కం॥ మీలను బోలువిపులనే
త్రాలున్ జంద్రసఖముఖంబు భ్రాజితరూపం
బాలావణ్యాప్రభయును
గాలాహిని బోలు వేణి గ్రాలెడి బాలన్ 114

కం॥ సర్వాంగరమ్యతలును సు
పర్వాంగన మించుచున్న బాలామణి నా
పర్వేందుముఖికి సేవల
నిర్వర్తించెడి నెలంత నెమ్మినిఁ గనుచున్ 115

కం॥ దీవనలిడి యామిబుదుఁడు
వేవేగము వేశ్మమున విచిత్రపు గదికిన్
రావించి గారవంబున
నా వెలఁదులఁ గూరుచుండ నాజ్ఞాపించెన్ 116

మ॥ దిననాథుండు తలంగుపద్మమటు మూర్తిభావముం బొందియుం
డిన సంతాపరసాధిదేవత యనన్ జెన్నొందుచున్నట్టి యా
యెన లేనట్టి గుణస్వరూపఖనిఁ దా నీక్షించి సత్యావదా
ని నిజప్రేమ మృదూక్తి నామెమనముస్ దేర్పంగ యత్నించుచున్

ఉ॥ "నీమధురోక్తి నీ తెలివి నిస్తులరూపకళాప్రశస్తినిన్
యామిని! నీదుజీవిత మనంతసుఖాంబుదివీచిడోలలై
మే మొనరించినట్టికృషి మే లగు సత్ఫలమై యెసంగ కి
ట్లీమహితవ్యథన్ బడుట దెంతయు జంపపుకోఁత మాకు నిన్ 118

శా॥ ఆ సంవర్ధనుబాహ్యారూపమును విద్యున్ దత్కాళానీకమున్
హాసంబున్ గని మోసమందుట నమూల్యంబైన నీజీవితం
బాసర్వాస్యము వాతఁ గూలుచు నవార్యం బుగ్రమున్ ఘోర మ
న్యాసాధ్యంబును నై నదుస్థితి నసహ్యాం బొటఁ, బద్మేక్షణా! 119

ఉ॥ తావకభావిజీవితవిధాన మె ట్లొట్లుగ మాఱునో, జపం
బే విధిఁ జేసి ధ్యైన నిపు డింత పెనంగెడిచిక్కుఁ దోఁవఁగా
నావలనన్ బొసంగునొ, కనన్ ననుఁ దావకమాతకోరుటన్
రావలె నిట్టివేళ నని రా నొనరించితి నిన్నుఁ, బైదలీ! 120

మ॥ పరవర్గాదుల నోఁచు టందుఁ దనదావర్గంబుదార్ఢ్యంబుగా
వరలం జేయఁ బ్రియుక్తియుక్తులను సంవర్తించు చొక్కొక్కటన్
సరిగా నింటికి రామి మీజనకుఁ, డీచాయన్ బనుల్ పోవు సం
చురుతాపంబున నీదుతల్లి యని, యెట్లో పోవ నన్ గోరెడిన్

కం॥ జతనముఁ గావించియు నీ
పతనము రాకుండ నిన్నుఁ బాలించెడి ది
ట్టతనము వీలుపడమి నీ
రతనముఁ బోలెడిచరిత్ర రమణిఁ దలంగెన్ 122

సీ॥ విఘ్నేశకాలమై వెలయుఁ బ్రాతఃకాల
మాదిపంచమభాగ మహమునందు
కౌమారకాలమై కాలు సంగవకాల
మలరు రెండవ పంచమాంశమందు
వైష్ణవకాలమై పరఁగు మధ్యాహ్నంబు
నల తృతీయపుఁ బంచ మాంశ మందు
పైతృతకాల మివ్వగ నపరాహ్ణాంబు
చాతుర్థపంచమాంశ మహ మందు

దేవతాకాల మహాకాంతదివ్యకాల
మదియెదేవీసమార్చన కర్త మగుట
నిట్టివేళ నిర ర మ్మంటి నిట్టు లైన
సాయమును జేయదేవీవిశాలకరుణ 123

కం॥ దేవీపూజను మొద లిడి
కావించెద నిప్పు డేను, గడవఱకును నీ
వీవేళ యుండు టర్హం
బీ వెలఁదికి వలయునేని నేఁగఁగవచ్చున్ 124

ఆ॥వె॥ రెండు మూఁడు గడియ లుండవలసియుండు
నరిగి పనులు తీఱినంత వచ్చి
కలసిపోవ నగును కా కట్లు పనిలేక
యున్న నామెకూడ నుండవచ్చు 125

కం॥ అంకిలి సెప్పక మది గల
యంకిలి మాయంగ దేవి నర్చించిన నీ
యంకిలిఁ బాసెదు వడి నో
పంకజముఖ! కూరుచుండు భక్తి దలిర్పన్ 126

శా॥ ఏదేవీకరుణాకటాక్షములచే నీబ్రహ్మరుద్రాదు లెం
తే దక్షత్వమునన్ స్వకర్మముల హాయిన్ వర్తిలన్ నేర్తురో
యాదివ్యామల భవ్యరూపరుచిరం బౌదృష్టి నీక్షించి నీ
దౌర్దైన్యమ్మును గావుఁగాక, ద్విరదోద్యద్గామినీ! యామినీ!

కం॥ ఇటు పలికి పుడమివేలుపు
స్ఫుట మగునంతాశ్రీ మిగులఁ జొక్కపు కివిన్
బటులీలఁ జదివి మొదలిడె
నటు పిమ్మట దేవిపూజ నార్భాటముగన్ 128

కం॥ దివ్య మగుశ్లోకరాజిని
శ్రావ్యముగాఁ జదివి పూజ సలిపి జపమునన్
భవ్యగతిఁ నిలిచి తడవుగన్
గవ్యక్షీరము నివేదనముఁ జేసి పోరిన్ 129

కం॥ ఒకగడియ యయినతఱిఁ బ్రి
క్కఱుఁ దిరుగుచుఁ గాంత నొంటిగాఁ గని తా నిం
చుక దేవీకరుణాసూ
చకముగఁ జని కుంకుమప్రసాదంబులతోన్ 130

శా॥ పూజాకుంకుమ బొట్టువెట్టుచుఁ గరంబున్ లాగి హస్తంబునన్
దా జాఱన్ విడుచున్ బ్రసాదమును, లోనన్ గైకొనం బల్కి యెం
తే జాలిం బడుచున్ సుగాత్రిగతి క్రై, యేణాక్షి యంసంబుపై
నోజన్ దట్టుచు భీతి వద్దనుచు స్థైర్యోత్సాహముల్ గూర్చుచున్

శా॥ "శ్రీదేవీకరుణాకటాక్షముల నీ చిక్కుల్ వడిన్ వీడి తేఁ
డే దాక్షిణ్యము మీఱ నీపతినిఁ దా నీక్షించునట్లున్ నినున్
భూదేవుండునుఁ బ్రేమఁ గాంచఁగ జపంబున్ బ్రీష్టఁ గావింపగా
నే దీక్షన్ వహియింతు, దేవియును నిట్లు పల్కెనాయాత్మలోన్

మ॥ అని యాకోమలి వీఁపుపై నిమిరి ప్రేమాన్వీతుఁడుం బోలెఁ, గ
ష్టనికాయం బిట్లు నీకు రాఁదగునె, బిడ్డా !' యంచు నాబాలపైఁ
దనహస్తంబును వైచి దగ్గఱకు దట్టం జేర్చి, 'నా ప్రజ్ఞ చే
తను గాపాడెద నిన్న' టంచుఁ దమి వక్త్రం బెత్తి ముద్దాడఁబోన్

కం॥ అదరున బెదరుచు సుదతియుఁ
బదములు తడఁబడఁగఁ బెదవి వణఁకఁ గనులఁ గెం
పు దనర మేనుఁ జెమర్పఁగ
నొదుఁగుచు నోపికను వీడి యూరక కనినన్. 134

శా॥ "నీనైజం బయినట్టిమంకుతనమే నీ విందునన్ దేక నా
యానన్ నిల్పెడిచో సదా ముదము సామ్రాజ్ఞి నీకు, లేకున్నచో
నీనైచ్యం బిఁక నేరికిం గలుగ, దో నీరేజపత్త్రేక్షణా!
పోనీఁబోకుము కాల" మంచు వడి నబ్బోటిన్ గడున్ బట్టఁబోన్

కం॥ విడివడి తడఁబడి దడఁ గొని
గడగడ నొడలెల్ల వడఁకఁ గడుఁజిడిముడితో
నెడఁదఁగల బెడద కినుమడి
నడచెడి చెడుగొడవ కడలి నడుమఁ దెగడుచున్ 136

కం॥ "నాస్థితియును నీ స్థితియును
నీస్థితి నాస్థను వహింప నేస్థితి నీ కా
నాస్థితి నీ హృదయంబున
సుస్థిరముగ నెటఁగికొనియె చొచ్చితివె యిటుల్ ?" 137

కం॥ అని చుఱచుఱఁ గనుగొను యా
మిసిఁ గని విబుధవరుఁడు స్మేరాననుఁడై
'ననుఁ గూర్చి యేమి పలికితు
జనముల నమ్మింపలేవు చలపాతి యనుచున్' 138

ద్వి॥ ఇవ్విధి నవ్వుచు నవ్విప్రుఁ డనఁగ । నన్నారవర్తిని యిన్నాగం బలికె

కం॥ "మతి నిర్మలగతి నుంచుట
యితరులకుఁ మేలుసేయు టెంచఁ గనెడిచో
నితరులకంటెను నీకే
హితశాంతిసుఖప్రదంబు, హేలం గనుమా! 140

శా॥ కావింపంబడు కార్యరాజి నితరుల్ కన్గొంట లేదంచు లో
భావం బొందుటె మౌర్ఖ్య, మీవు కనినన్ బ్రాల్మాలినం గూడఁ ద
ద్భావంబుల్ పనులున్ వెలింబడు తొలిన్ వ్యాప్తంబులై లీల నెం
తే వృద్ధిన్ నినుఁ దత్ఫలంబుఁ గనఁగా నేఁచున్ సమర్థంబులై

కం॥ దుర్భావము నెమ్మదిఁ బ్రా
దుర్భావము గనుటవలన దోష మ్మెపుడున్
దుర్భావచక్రవర్తీ!
నిర్భరముగ నీకుఁగాదె నిజ మెంచెడిచోన్! 142

చం॥ పెదవిని దాటుమాట పృథివిన్ వడి దాటు నటంట యంత్రమిం
పొదవఁగ జాటుఁ గ్రిమ్మఱుఁ దదుస్తులఁ బల్కుచు, నట్టిరీతినే
మదిఁ గలయోజనల్ తెలుపుమాన్యులఁ బట్టి యెఱుంగ నీమదిన్
బొదలుతలంపులున్ జననముం గనునంతనె పృథ్వి దాటుటల్

చం॥ ధ్వనులతరంగముల్ వలెనె భావతరంగములున్ జనించునం
తనె జగమెల్ల వ్యాప్తమయి తత్ఫల మొందఁగఁజేయు నీ వెఱిం
గినఁ గనకున్న, నేపరునికిన్ దెలియంబడ దంచు నెంచ కా
త్మను ఖలవృత్తిశూన్యముగ మార్పుము, పుణ్యజనాగ్రగణ్యుఁడా!

కం॥ నీ విద్యాపటిమంబుల
నీవెట్టుల మోసగించుటే శక్యంబౌ
నీవిద్యల నీ కొసఁగిన
యావిశ్వేశుని మొఱంగు టెట్లు తరంబౌ? 145

మ॥ ఎలమిన్ సర్వగసచ్చిదుత్తమవిశుద్ధైకాత్మ యైనాతఁ డద
న్యులకున్ జేసెడి కీడుమేళ్ళతఁడె పొందున్, దాను బ్రత్యేకతన్
నిలఁగాలేఁడు నరుండు సంతయిన, నన్నింటన్ బ్రపంచంబు నం
దలి సంబంధము లుంట, నీ కొఱకె నీదౌష్ట్యంబు వీడన్ వలెన్"

చం॥ అనఁగఁ గురంగి పైని బడు నట్టిపులింబలెఁ జూచుచుండఁ గ్ర
క్కున జలజాక్షి పైఁ బడుచుఁ గుయ్యిడకుండఁగ నోటగుడ్డలన్
జొనుపుచుఁ గాలుసేతులను సూటిగఁ గట్టి యతండు మూల నుం
డినగది దాఁచి, యెంతయు వడిన్ బిలిపించెను భృత్యు నొక్కనిన్

కం॥ వేగమె శ్యామలమిత్రునిఁ
దేఁగా నాజ్ఞప్తిఁజేసి తెచ్చినపిదపన్
లోఁగొని యాతనిమనమును
లోఁగొను రూప్యము లిడి తుత్రిటిలోఁ బదినూర్లన్ 148

మ॥ అతిగూఢంబుగ వేగ మీసుదతిఁ బ్రాణాంతంబుఁ గావింపమిన్
మితిలేనట్టివ్యథాళి నేఁ బడుదు, దీనిన్ వేగఁ గొంపొమ్ము ! స
మ్మతి నీలేమ నగల్ క్రిమాన విభజింపంబోలు నీ వేనుఁ ద
త్ప్రితమున్ తెల్పుదు వీడు వీడి యెటో యార్తిఁ బోయెనం చెట్టులో"

అపమర్శము

శా॥ "అమ్మా! మాధురి! యిద్ది మంకుతనమో! యాత్యంతిక మ్మానతీ
త్వమ్మో! ప్రేమయొ! నాదుకర్మమొ! కథాభాగంబులం దేఁడ నే
నిమ్మాడ్కిన్ గనఁ, గూడ గుడ్డయును లే కెన్నాళ్ళ నీ వుందుఁ? బ్రా
ణమ్మే పోయిన వెన్క నింక నిలఁ గానన్ సౌఖ్య మే ముండెడిని?

మ॥ బలవంతుల్ ధవవంతులాన్ విమలరూపభ్రాజు లుద్యోగవం
తుల సంఖ్యాకులు కోరినన్ వినక రంతుం జేసి నీ వ్రేటులో
యఁలసంవర్ధను నిచ్చగించుటకు లో హర్షంబె కా కిద్ది యా
సిలువుం గూర్చి హరించు హేతు వని నాచిత్తంబునన్ దోఁచెనే ?

కం॥ సరిగా రెండుదినంబుల
వఱ కీవిటు మాను నెడలఁ బ్రాణమె పోవున్
ధర నాపై నీకఁ గనఁ గల
వరఫల మది యేదో తెలుపు, పంకజనయనా !

శా॥ ఆతం డొక్కదినంబు కూడ మనగేహంబందు లేఁ డయ్యో సం
ప్రీతిన్ ! నూతన మయ్యెఁ బట్టణగతుల్ ! నే లేదా కీ డేదొ త
చ్చేతంబుల్ గనదయ్యె! లేని యెడలన్ జేకొన్నె యాశ్యామలుల్
లాతుల్ లేరొకొ! పల్లెటూరిపశు వేలా నీకు! శాతోదరి! 143

కం॥ నెలయాలికి నొకమగఁడును
గలఁ గనుటకు నొక్కగతియుఁ గలుగుట వింతే!
వెలఁదులు నవ్వరె యెవరికిఁ
దెలియని జడుకొంటకు నిట్లు తిప్పలు వడుటన్! 154

మ॥ ధన మవ్వారిగ నుంటఁ గన్గొనుచు నేతత్స్వాములుం డట్లొ యా
తని ప్రమోదించి ధనంబుఁ గైకొనియెనో? తన్మంత్రియింటన్ సుభో
జనముల్ చేయుచు నిన్నతండు విడెనో! చాలున్, మహామేయుఁ జే
కొనఁగాఁ గల్గితి వెంచి యెంచి! తుల నీకుం గల్గునే యెచ్చటన్!

శా॥ విద్యారూపకళావిలాసతతులన్ విఖ్యాతఁగా జేయుచో
హృద్యార్థంబుల నెల్లఁ గూర్చి నను సంప్రీతాత్మగాఁ జేయు దం
చుద్యల్లీలల నీకునై విడితి నా కున్నట్టి యైశ్వర్యమున్
బోద్యం బొప్పఁగ నన్నుఁ గూర్చితి విటుల్ నూనంబుగా నల్వురన్

ఆ॥ వె॥ ఆటవెలఁది ముందుఁ దేటగీతి తగల
చంపకోత్పలములు సాటి గాఁగ
మధురమృదుసుగంధి మత్తేభగామిని
వీవె యిట్టులు మ్రగ్గు టెంతవింత! 157

మ॥ హృదయాహ్లాదంబున మేటినాయకమణుల్, కేఁగంటిదృష్టిన్ గళా
స్పదులున్, బొమ్మమొగిడ్పులన్ బంగారుత్తైశ్వర్యప్రభాశోభితుల్
పదవిన్యాసములన్ సమస్తజనులున్ బాదమ్ములన్ వ్రాలి నో
మదిరాక్షీ! యిటు లేల నేలఁ బడ టెట్లా నీ ప్రభావోన్నతిన్!"

ఆ॥వె॥ బహువిధముల నిట్లు వాకొనుచున్న యా
వేశ్యమాత యెదుటఁ బృథివి మీఁద
మూర్ఛఁ గొన్నయట్టిపూర్తి యార్తియె నాఁ బ
రుండె మాధురి కడురూఢి మెఱయ 159

మ॥ నగ లందంబులు వీడి తిండి మొదలంట న్ వీడి జీర్ణస్థితిన్
మిగులన్ మాసిన చేలమున్ గటుఁగడున్ దీనంపుదృగ్జాల మొ
ప్ప గవాక్షమ్మునె చూచుచున్న కృశ మావక్త్రానఁ, బ్రాణావళి
ప్రగతిన్ మానమునన్ బరుండె నగజన్ స్వాంతంబునన్ నిల్పుచున్

కం॥ 'మాధురి! మాధురి ! ' యనుచున్
వీధిని వినఁబడుట వినుచు, విలు విడు ఖగమై
బాధలు మఱుమాయము గా
మాధురి వడిఁ దలుపుఁ గెఱచి మాన్యునిఁ గనుచున్ 161

చం॥ పదముల వ్రాలి యశ్రుతతి వానిని క్షాలనముం బొనర్చి స
మ్మదమున లోఁ దమం బెడలిపోవఁగ వానికర మ్ము రమ్ము నం
దదుముచు లోన నున్నగదియందునఁ జేర్చుచుఁ బ్రేమ సేమ మిం
పొదవఁగఁ బృచ్ఛఁజేసి మహితోన్నతి నాతనిపజ్జ నిల్చెనన్ 162

శా॥ తా నీచోటును వీడి యున్నది మొదల్ తత్పంకజాతాక్షి సుం
తే నిద్రాహ్యతిభూషణాదికము లే కిమ్మాడ్కి నేకాగ్రతన్
దా నేలం బడియుండుటల్ వినుచుఁ దద్దుస్ దేర్చుచున్ స్నానముం
బానం బొపిదపన్ వచించెఁగథ సర్వం బాసరోజాక్షికిన్ 163

శా॥ ఆసంవర్ధనుఁ డట్లు యామిని వివాహం బొడు టాలించి యుం
తే సంతోషముఁ జెందె మాధురి, ధరిత్రిం దాజ్ఞ నాలించుటన్
దాసం బొందుచుఁ దద్వ్యముక్తి నిడ నా ర్తత్రాణపారీణుఁడో
నాస ర్వేశుఁడుఁ గూడఁ జాలఁ డని యత్యంతవ్యథాపూర్ణ, కాన్

గీ॥ మాసియున్నట్టితలుపులఁ ద్రోసికొనుచు
వేశ్యమాత యాఁపినఁ గూడ వేగ మలర
వచ్చి శ్యామలశాస్త్రి సంవర్ధను నటఁ
గాంచి హర్షింప శ్యామలుఁ గాంచి యతఁడు 165

కం॥ "నే వచియింపఁగ శక్యమె
నావిషయం బీతఁ డొందిన శ్రమంబును, నే
నావిధి యామినిఁ గైకొన
నీవిప్రుఁడె కతము, కొనిన నేమి ధనంబుల్! 166

కం॥ సత్యావధానికిని నా
కత్యంతము మైత్రిఁ గూర్చి యాతఁ డమాత్యున్
జాత్యభిమానపరిష్ఠు న
పత్యము నా కీయఁజేసె వాక్చాతురి చేసి" 

కం॥ అని యాతం డను చుండఁగ
గని శ్యాములునొడలి పైని గలదెబ్బల నా
వనజాక్షి 'యవ్వి యేగతి
జనియించిన' వంచు నడిగె సరభసరీతిన్ 168

కం॥ అదరుచు బదులిడె నాతఁడు
విదురవనయగుగున నుండి నేలకు రాత్రిన్
బెదరునఁ బడుటఁ దగిలె నని
యది విని సంవర్ధనుఁడు హసియించి యనెన్. 169

ఉ॥ "శ్రోత్రియవంశు నా కితరశాస్త్రములంబలెఁ బ్రజ్ఞ యుంటచే
నీతఁడు దెబ్బ లెట్లు వడె నిప్పుడు తెల్పఁగ నేర్తు, రాత్రియే
యీతఁడు నింకఁ గొందఱును నింతి నొకర్తుకఁ గొంచుఁబోవుచో
నీతని వారిఁ గొట్టి వనజేక్షణఁ గైకొని పోయి రెవ్వరో 170

కం॥ 'కా దని యందురె, నెచ్చెలి,!
యేదియు నిందుల' " నటంచు నెంతయు మృదుహా
సాదుల నుచ్చిక నతఁ డన
వాదింపక శ్యాములుండు పలికెడి నిట్లుల్ 171

గీ॥ "ఇదివఱకె కాంచి యుంటి నే నెన్నొగతుల
నీదుసర్వశాస్త్రప్రజ్ఞ నిశిత మనుచుఁ
పక్షరాజకీయాదులు ప్రబలుచోట్ల
నిట్టిభంగంబు లుండు, నిం దేమి వింత ? 172

గీ॥ ఆశయంబులు గొప్పవై యలరుఁ గాని
యాచరణమందుఁ గల్గుటే యరిది యెందుఁ
పక్షరాజకీయాదులు పరఁగుచోట్ల
సాజ మిది. దీని మార్పంగ శక్య మగునె ? 173

మ॥ అధికారాదుల నొందు, టందు నధికారానీకముల్ నిల్పుటం
దధికారాదుల నిర్వహించుటను, సాహాయ్యంబు గావించున
య్యధిమిత్రాళికి మేలు సూపుటల, నన్యం [illegible]నపక్షాదులన్
విధిగా లోకువ నుంచు టందు, నెటు పృథ్విన్ నిల్చు సద్ధర్మముల్

కం॥ ఏతద్రీతుల నధికృతి
చేతులఁ గలవారె సేయఁ, జిత్రమొ యధికా
రేతరవర్గమువారల
చేతము లెన్నొ యధర్మసేనుల మనుటల్ ! 175

మ॥ అధికారేతరవర్గమందలి యమేయప్రాభవోపేతు లి
వ్విధికిన్ నీస్థితిఁ దెచ్చి రాసచిపుపై బీరాన, నాటేని కా
విధివిశ్వాసము పెంచురీతులు బిగన్ బేర్పొందె, నీ ప్రైసదు
ష్పృథ మవ్వారలయత్నమందు మిగులన్ సాయంబుగా నయ్యెడిన్

శా॥ ఈరీతిన్ మనువారివర్తనము సందె న్నెన్ని యనర్థంబులో
ధీరోదాత్తతతుల్ మణంగెడినొ యార్తిన్ నిస్సహాయస్థితిన్
స్ఫారప్రాభవు లౌచు నెంచఱు శతుల్ భవ్యాధికారాదులన్
మీఱం గల్గి దురాగతాదుల ధరన్ వేధింతురో, లెక్కయే!

మ॥ పరవర్గాళి నభూతకల్పనలచే వంపం బ్రియత్నించు నె
వ్వరు స్వల్పం బగుహేతువే దొరుక నుబ్బన్ జేయరే యెన్నొమా
దిరులన్! వారును వీరు పోరుతఱినిన్ డెల్విన్ దృతీయుండు మీ
ఱి రథంబెక్కెడి! ధర్మ మేడ నిఁక వర్ధియంపురాజ్యంబులోన్! 178

మ॥ పరిజలన్ వీలయినట్టిరీతులుగఁ దద్వర్గోపయోగాదులం
దుఁ జరింపన్ జన వాడుపట్లఁ బ్రిజలందున్ బుట్టి పెంపొందు న
క్రజ మా నాశనకారణం బగుకుమార్గశ్రేణు లెన్నెన్నొ య
య్యాజుఁడేనిన్ వివరింపశక్యమొకొ! యేలా కల్గుశాంత్యున్నతుల్

కం॥ నాయము నన్యాయము నని
యేమెడ నిది గౌరవంబు ని దగౌరవమం
చీయిలఁదలంకు సోమరి
కే యున్నతికలుగ నేర్చు నేవిషయమునన్ ? 180

కం॥ సరి! యీసగాగముల కే
మి! రయంబుగ రమ్ము! నిన్ను మేకొని బంధిం
ప రభసముస భటు లట సిలి
చిరి, నిన్ గొంపోప నేనుఁ జేరితి నిటకున్" 181

మ॥ అని యాశ్యామలుఁ పన్న, మాధురిరయు నత్యంతవ్యధాపూర్ణయై
'ధన మెంతెంతలు గొంటి పేఘునుసిరయొప్పెస్ నీవు! విశ్వాసముల్
గనఁగా వ్యగ్రాకొ! నూఱుమూక లివె వేఁగ్రకొంచు నొక్కొ బటా
ళినిఁ బోఁద్రోలు' మటంచు రూవ్యములఁ జెల్లింపంగ నవ్వ్రిప్పుఁడున్

ఆ॥వె॥ "ఒప్పగించుకొఇకె నొక్కనూ ఱియంగ
నొప్పఁజెప్పి పంప నొక్కనూఱే!
యేది కష్టతరము యించు కంత గ్రహించి
యన్యరీతి సేయు" మ న్న నామె 183

మ॥ మఱియొ కేఁబది రూకలిచ్చుకొని యమ్మాన్యాత్మ యవ్వానిజె
చ్చెఱనవ్వీథికిఁ గొంచుఁబోయి భటరాజిన్ గాంచి యచ్చోటని
వ్వెరనుం బొందుచు నై నెసంగు నగలన్ వేయైదు వేల్ రూకలస
ధరఁ బెంపొందెడి వాని వారి కిడె నాత్రం బొప్ప లంచంబుగన్

కం॥ ఏణనయన యెటులో భట
శ్రేణిన్ శ్యామలు దయార్ద్రచిత్తులఁ జేయన్
బ్రాణేశ్వరునికిఁ బ్రాణ
త్రాణ మ్మిడ మాట నిచ్చి తరలిరి వారల్ 185

శా॥ ఆసీమంతిని లోని కేఁగి సకలం బామూలచూడంబుగా
నాసంవర్ధనధీరు కర్ణముల వేయన్ నవ్వి యాతండు 'సం
త్రాసం బీగతి నొంద నేమి ఫల మొందం గల్గు? సద్వార లిం
దే సంచారము సేయ కెట్లు సన నా నీచోరుఁ గొంపోవకే?'

మ॥ అని యామాధురి గొన్న యార్తమునకై యాతం డటన్ మందలిం
చి నయమాపిమ్మట ధైర్యవాక్యముల నౌచిత్యంబు పొల్పొంద నా
మెను నుత్సాహినిగా నొనర్చి పురికిన్ మెల్లంగఁ దానేఁగి యం
దునఁ గొన్నింటిని ముఖ్యకార్యములఁ బొత్తుం జేసి రాఁ గోరినన్

శా॥ 'ఈవార్తావరణమ్మునందుఁ బురిలో నేమూలకున్ సుంతియున్
బోవన్ భావ్యము కాదు, పోవ నసువుల్ పోవున్, వడిన్ జాతురిన్
బోవన్ మేలు పురమ్ము దాఁటి' యని యంభోజాక్షి పల్కంగ స
ద్భావం బొప్పఁగ నాతఁ డామెను ధృతిన్ భాసిల్లఁగాఁ జేయుచున్

మ॥ "'అతిసంతృప్తికరంబుగాఁ బిత్రధనం బబ్జాక్షి కెం తుండినన్
బతిసంపాదన మంచుఁ గొంత ధనమో బంగారమో లేనిచో
సతి నూనత్వము నొందు నొక్కొకతఱిన్ సాధ్యంబు గాకున్న స
మ్మతి నొందన్ జనుఁగాక సాధ్య మయినం బాట్లేల నీరీతిగన్?'

కం॥ కడు నిటు పడఁతుక యెడఁదం
జెడిముడి భావంబు రగులఁ జేయుటకొఱకై
తడయక జడియక నేనే
కడఁగుచు యామినిని నిట్టిగతి నడపితిసగా! 190

కం॥ ఒకపని సాధించెడిపూ
నికమైన నిటు లాసుగాత్రి నేనే యీాదా
రికిఁ దెచ్చి యిటుల నడిపితి
వికలాత్మవు కాక వేచి విను తద్విధముల్ 191

కం॥ చింతలకు మదినిఁ దావిడు
చింతలు నంతలుఁగఁ బెంచి యెంచ కితర మా
చింతల మానుచు మాధవు
చింతల మను చుండు, మగుడఁ జేరుదు వడిగన్ 192

ఆ॥వె॥ ఎదురు పలుకఁబోక ఎదురు చూచుచు నుండు
మేను వచ్చుదనుక నిటనె ధృతిని
సుగుణనిలయ వేని చొక్కుమీాశ్వరభక్తి
విజయ మొంది వత్తు వేగ మేను" 193

శా॥ ఎన్నోరీతుల నచ్చఁబల్కి తన కేయిక్కట్టు రానేర దం
చన్నారీమణి నమ్మఁజేయుచు నతండచ్చోటికిన్ వచ్చుదాఁ
క న్నించం బగు కాంతిరత్నముఁ గనంగా వ చ్చటం చెన్నియే
వన్నెల్ తిన్నగ మిన్న వల్కి యతఁ డప్పట్లన్ బ్రయాణంబు కాన్

కం॥ ఎదురాడ నోడియును దన
మది నేమియుఁ దోఁచ కామె మౌన మెనసి, తా
నెద నీశు నిలిపె వేడుక
నదనున నాతనికి సుఖజయాయువు లీయన్

చం॥ ఘనబలశిక్షితోగ్రదశకంధర కంధరనీలదేహ దే
హసియమునాతిరిక్త విమలాత్మక యాత్మకథావిమోహితా
త్యనుపమధీర ధీరవిబుధా విబుధాధిపసేవ్యపాద పా
దనిహతిరక్షితోపలవిధప్రమదా ప్రమదాసురాంతకా! 196

ద్వితీయ సముల్లాసము సమాప్తము

# సంవర్ధనము.

## తృతీయ సముల్లాసము

కం॥ శ్రీమద్దివ్యమృదుకటా
క్షామృతసంపోషితాఖిలాశ్రితనికర
క్షేమా! సీతాకామా!
ప్రేమాన్వితసుగుణధామ! విబుధస్తోమా! 1

### సమాధానము

చం॥ మనసచివుండు ధీరమణి మాన్యకుమారికిఁ బెండ్లియాఁటయుఞ్
బెనిమిటి ఘోరచోరమణి వీఁకను బంధితుఁ డౌటయున్ నరేం
ద్రుని కతఁ డెంచు ద్రోహమును రోయుచు రాజసభాసదుల్ రయం
బున నురిఁ దీయ నెన్నుటయుఁ బుట్టె విచిత్రము గాఁగ నింతలోన్

కం॥ నిశ్చింత మున్న వాఁ డఁట!
నిశ్చయముగ సర్వశాస్త్రనిపుణుం డఁట! తా
నాశ్చర్య మొప్ప సకలవి
పశ్చిల్లోకనుతిఁ గన్నవాఁ డఁట మిగులన్! 3

కం॥ వింతల వింతగ నింతలు
నింతటిలోఁ గాంతు మంచు నెంచితి మొక్కో!
యంతటి పండితమండనుఁ
డింత యకృత్యంబు చేసి యిటు లౌటేమో! 4

ఉ॥ శ్యామలశాస్త్రివంటి ఖలు లాతనికిన్ హితులంట, యెప్పుడున్
వేమఱు నిందు నందుఁ గడుఁ బెద్దపనుల్ గలవాఁడు వోలె నే
యామము సంచరించునఁట, యంతటిపండితుఁ డైనవానికి
ల్లేమిటికిన్ విధించె విధి యిందునియందలికందుమాదిరిన్ ! 5

ఆ॥ వె॥ ఉరికి ముందు దోషి కొక్క కోరికనిచ్చు
చుంటఁ గలదు కాదె యుర్వియందు !
నటులె యితని కీయ నధిపునిసభలోనఁ
బలుకఁ గోరెనంట పావుగంట 6

ఆ॥ వె॥ అమరుకంబువోలి యమరంబునుం బోలి
యిద్ధకావ్య మిద్దియే నతండు
మృతికి ముందుఁ బలుక మతిఁ బూనెనో ! కాక
సచివుసాయమునకు సమయ మిడెనో ! 7

చం॥ సకలం బైన ప్రజావళిన్ నిలిచి జస్వాంతుండు గా నున్న యె
న్నికలం గూర్చి ప్రబోధమున్ సలుపఁగా నేఁ డెల్లు నేర్పాటయై
ప్రకటింపంబడి యుంట నాసభనె సంభాషింప నాజ్ఞప్తి వా
నికి నీయంబడి యుండు నాతఁ డనుదానిన్ వాని వీక్షింపఁగన్”

మ॥ ఇటు లొక్కొక్కరితో నొకళ్లను, చటన్ పేఁలాగతిన్ మర్త్యుల
చ్చట వారెల్లరు గుంపులై సభను గాంచం బోయి, రానాఁడుకా
కటు లేనాఁడును లక్షలాది యటు మర్త్యశ్రేణు వింపొంద కుం
డుట నాశ్చర్యముఁ బొంది రెల్లరును బిట్టున్ దత్సభావ్యాప్తికిన్

మ॥ అలసంవర్ధను సైన్యమందలిజనం బాడాడ సామాన్యమ
ర్త్యులలీలన్ జరియించుచున్ సభను మార్పున్ బొందు వేషాల ని
స్తులసంఖ్యాకులు చేరియుండుట నటన్ సొంపున్ వహించెన్ సభా
స్థల, మీసంగతి నే రెఱుంగమిని నాశ్చర్యంబు పెంపొందెడిన్ 10

గీ॥ వివిధ వర్గైక్య సూచక విజయకేత
నమ్ము సమ్మోద మిడుచు నున్నతుల వెలయ
మహితదూరశ్రవణయంత్రసహిత మగుచుఁ
బటువిశాలత మించె సభాస్థలంబు 11

గీ॥ బహువిధసువర్ణతోరణపంక్తి యనఁటి
కంబములు, నంద మగు మేలుకట్లు, సుజన
గణ్యమై యొప్పు భూర్యలంకార తతులు
మీఱె సభఁజేరి కనువారు కేరి పొగడ 12

మ॥ చివురాకుంగమియున్ బ్రసూనములు వాసిన్ బొల్చు లేఁగొమ్మలు
ద్దవిడిన్ రమ్యతఁ దావు లెల్లెడల వ్యాప్తంబౌ నటుల్ చేసి, ని
ల్వ, విచిత్రం బగు సాలభంజికలు జీవచ్చిత్రముల్ వోలి మ
ర్త్యవితానమ్ముల పై సుగంధజల ముద్యల్లీలన్ జల్లెడిన్ 13

గీ॥ కాంతిమంతంబును ఘనంబుఁ గాచమయము
గడు నమూల్యములౌ ననేకవిధము లగు
వర్ణములఁ జిమ్ముచున్న రూపములు వ్రేలెఁ
బందిరిని నిందు నందుఁ జూపఱులు బ్రమయ 14

గీ॥ వివిధవర్గనాయకులవి, విశ్రుతులవి,
విజయగాథావళిస్మృతిఁ బెంచున వియుఁ
జిత్రచిత్రంబు లందందుఁ జెలఁగి జనుల
నిస్తులానందలహరినిన్ దేల్చె మిగుల 15

కం॥ ఘనమోద మెసఁగ నెల్లరు
జనములు నాసభను జేరి సమత వినంగాఁ
గనఁగనుఁ దగు నేర్పాటులు
దనరింపఁగఁబడియె నచటఁ దత్జ్ఞులు మెచ్చన్ 16

మ॥ జయరావమ్ములు మెన్నుముట్ట నమితోత్సాహప్రమోదంబులున్
నయమొప్పన్ గవిగాయకుల్ పొగడ నానందంబు దీపింప నా
శయముల్ ధీరులు బిగ్గ వల్క నటకున్ సర్వంసహాకాంతుఁ డెం
తయు శీవిన్ బరివారయుక్తుఁ డగుచున్ నల్వొప్ప నేఁతెంచినన్

కం॥ రాకాశశిరాకకు నీ
రాకర మేకరణిఁ గెరలు నాకరణిని మో
దాకర మగు నాసభ ఘో
షాకలితం బగుచుఁ గెరలె నాసమయమునన్ 18

మ॥ నవభావోదయకారియై కువలయానందంబు నొందించు రా
జవరేణ్ దానును మిత్రమిత్రుఁడయి సత్ స్తోమప్రయుక్తుండునున్
గవిసంప్రీతుఁడు మర్త్యహృత్కువలయానందప్రదుండున్ దిదృ
క్షువినోదుండును హైమనుండు నయి రాజున్ బొల్చెడిన్ దత్సభన్

శా॥ ధీరుల్ ముఖ్యులు నాయకుల్ మొదట దీప్తిన్ గొన్ని యంశంబులన్
స్ఫారప్రాభవు లౌచుఁ బల్కిపిదపన్ సంవర్ధనుం డా సభన్
గోరెన్ బల్కఁగ స్వల్పకాల మురికిన్ బూర్వాంబునా వించు న
వీరగ్రామణి వేగ మాపని సమాప్తిన్ జేయఁగాఁ బంచుచున్ 10

కం॥ 'పశ్చాత్తాపము నిచట వి
పశ్చిల్లోకమునఁ దెలియఁబఱచుచుఁ బిదపన్
నిశ్చింత మసువు వీడఁగ
దుశ్చరితుఁడు తలఁచె ననుచుఁ దోఁచెడి ననియెన్' 21

శా॥ ధీరాకారుని మారసుందరునిఁ దత్తేజోవిరాజద్ఘనున్
వీరాగ్రేసరుఁ బండితున్ ఘనకళావిస్ఫారు సంవర్ధనున్
స్మేరాస్యున్ గని యట్టిభవ్యునికి తన్నీచత్వమున్ బూనఁగా
నేరీతిన్ విధి కూర్చెనో యనుచు వారెంతేని చింతింపఁగన్ 22

మ॥ ఘను సంవర్ధను సద్యశోధను మహాకార్యంబునం దెచ్చి భృ
త్యనికాయంబు సభాస్థలమ్మునకు మధ్యంబందు నిల్పంగఁ బె
ట్టిన, నాతేఁడును వానిరమ్యతనుఁ గుంఠీభూతచేతంబునుం
గని వింతం గొని పల్కఁ గోరునది పల్కం బంపఁగా నాతఁడున్

మ॥ "ఇల నేధార్మికకార్యమందు ఘనయోగీంద్రాళి దుస్సాధ స
ద్బల మేపొందఁగ వట్టి మర్కట, శిలా,వ, హ్న్యంబు, జం, త్వభ్రగా
దులు సైతంబు నిజాన్యసద్గుణతతిన్ దూర్ణంబుగా సాయమై
గెలువం జేసెనొ! యట్టిరాఘవుని భక్తిన్ గొల్తు మచ్ఛక్తిన్."

కం॥ ప్రార్థించి రాము సీటులు స
మర్థతమై సభను ఊని మంత్రి నితరులన్
సార్థకముగఁ జూచుచు సం
వర్థనుఁ డీరీతి నచటఁ బలుకఁగఁ దొడఁగెన్

మ॥ "తనదోషంబునుఁ దా నె కాంచు శివుఁడే, తద్దోష మన్యప్రజల్
గనఁగాఁ జేయఁగఁ గాంచుచో ఘనుఁడు, డెటుల్ గాంచంగఁ జేయంగఁ గూ
డ నిజాహంకృతి నన్యులన్ వెతలవెట్టం జూడ నీచుం డగున్
దన దా దోషఫలంబు నన్యులనుఁ గానంజేయువాఁ డెవ్వఁడో!

ఉ॥ ఉన్నది యున్నరీతిఁ గలయుత్తమవాక్యములా 'నిసత్యమే
యెన్నిక నెన్నికొంచు నటు లెవ్వరు పల్కిన నల్క నుల్కకీ
తెన్నున నిస్తులాశయగతిన్ నిలఁగల్గిన ధీరు లున్నచో
మన్నతు లామహామహునిమంజుపదద్వయికిన్ గడుంగడున్ 27

శా॥ మీయాజ్ఞప్తిని మీపురంబుననె మీమీమధ్యమంబందు మీ
రేయేదానినిఁ జూపఁ గోరి రవియే యిచ్చోటఁ జూపన్ మహా
మేయుండైనమదీయనేత నను నెమ్మిం బంప నేఁ బూనితిన్
వ్రాయంగాఁబడువానిఁ జూపమిని నే బద్ధుండ శిక్షార్హుఁడన్ 28

శా॥ నా కీయంబడినట్టిస్వల్పసమయానన్ బూర్తిగాఁ దెల్పుదున్
గా కాలో నను నాఁపఁ జూచుటయుఁ బూనన్ రాని యుద్వేగముల్
జీకాకుల్ గనుచుంటయుల్ దగదు నేఁ జెప్పంగనై యున్న దా
దాఁకల్, బూర్తిగఁ దేల్చుపిష్టటనుఁ ద్వాద్వాభవాళిఁ దెల్పం దగున్

కం॥ మామంత్రిసమాధానం
బే మని యిడునో కనంగ నెంతయుఁ దమితో
నో, మతిభంగపఱుపనో,
యీమాదిరిప్రశ్న లడిగి రెంతయు వింతల్ ! 30

ఉ॥ 'లంజలలో సతిల్, గృహిణులం గననౌ ససతిన్, సజీవుఁ డ
య్యుం జని యున్నమర్త్యుఁని, ధనోన్నతుఁ డౌనిఋపేద, పాండితీ
రంజనఁ గ్రాలు కించుపసరమ్ముగ్, సభన్ బిరు దొందు వేపి, గ
ద్దెం జరియించుగార్దభముఁ, దెల్పు మిఁ వెల్లఁ బొసంగు దేశముల్ !

కం॥ న్నియుఁ బొసఁగిన దేశము
కన్నుల కట్టెదుటఁ మనకుఁ గనఁబడుచుఁ గడున్
మిన్నగఁ బ్రదర్శనం బిడు
చున్నది మనపక్క నిలిచి, యూహింప నగుల్ 32

చం॥ తెలియదు లేదు గా దనక దేనినిఁ గూర్చి వచింపు మన్న ని
చ్చలును సమగ్రతన్ దెలుపుశక్తి యుతుం డగుమీదుమంత్రికిన్
దెలియక యున్నె తత్సహిత దేశ ? మొకంట నెఱుంగ కుండినన్
దెలుపుఁడు నాకు! మీ కపుడు తెల్పుదు నేను సవిస్తరంబుగన్'

కం॥ అని యిటు మీ రడిగిన యీ
ఘన మగు ప్రశ్నాళి కొంతకఠినతరం బై
కనఁబడినఁ గొందఱకు ధర
వినుతుఁడు మామంత్రి కొక్క పెద్దవిషయమే ? 34

మ॥ బదు లీలేఖకు మామహాసచివుఁడే వాక్రువ్వ వాంఛించినా
రిది యే మంతవిశేషసంగతిగ వారెంచంగ లేకుంటచే
నిది యెల్లని ముగింపు బాలకుఁడ వౌ నీ వంచు నాతం డిటుల్
ముదలన్ జేయుటచేఁ గడంగితిని నేఁ బూర్ణంబుగా దీనికిన్ 35

కం॥ ఇఁక నేఁ జెప్పఁగఁ బూనెద
నొకఁ డొకఁడును మీర లడిగి యుండినవానిం
బ్రకటనకు వినుచు వానిని
నొకఁ డొకఁడును వ్రాసి యొసఁగుఁ డొప్పినయట్టుల్ " 36

కం॥ నిశ్చేష్టత వారెల్లరు
సాశ్చర్యమనస్కు లౌచు నతినిశ్చలులై
నిశ్చింత మతఁడు పలుకువ
చశ్చయముల వినఁదొడఁగిరి సద్దు తొలఁగుచున్

శా॥ తా నాయూరనుఁ జేరియుంట మొదలే తత్కాలపర్యంత మెం
తే నీచత్వ,మహోన్నతుల్ పొసఁగఁ దా నెట్లెట్లు వర్తించె న
ద్దాసిన్ బూర్ణముగా సమస్తజనులా స్థన్ వింత నాలింప నెం
తే నేర్పొప్పు వచించి యాపయి సతం డీరీతిగాఁ బల్కెడిన్ 38

## లంజలలో సతి

కం॥ "సామాన్యాంభోజనయన
సామాన్యముగా మెలంగుజాడలు సకలం
బే మాన్యాత్ములు నెఱుఁగరె
తా మాన్యధనాపహరణతత్పర యనుచున్

కం॥ నమ్మించు నెమ్మి నెల్లర
నమ్మదు కొమ్మలఁ గరమ్ము నమ్మిన నేనిన్
నెమ్మది యిడ, దటుకనఁబడ
దిమ్మహి నెమ్మదిగఁ గొమ్మ నెల్లరసొమ్ముల్ 40

కం॥ రోవెలఁది రోసి చని, పో
రో, వెలఁ దిటమైనఁ తమసిరుల్ స్థలములు వో
రోవెలది రోయఁగా, ‘ నిసి
రో ! వెలఁదికిఁ గరుణలేదురో!’ యనుచు విటుల్ 41

ఆ॥వె॥ గోడ్డుపైని వేసికొన్నసున్నమైన
వెలవెలంది కిడినవిత్తమైన
మరల వచ్చునంట నురివడి బ్రదుకుట
యద్ధిఁ బడినసూఁది యగ్గుబెకద!

శా॥ ఏ నీమాధురి కిచ్చియున్నది లవం, బీకాంత నాకోస మెం
తేనిన్ విత్తము ధారపోసినది, యే నీలేమకుఁ జెంగటఁ
లే నప్పటితియు లంక నామహిజపోల్కిన్ ముక్తసౌఖ్యాళియా
నే నామంత్రిసుతఁ గ్రహింప విని యెంతే మోదమే పొందెడిఁ?

మ॥ ఇది యెల్లఁ గపటం బటం చయిన ముం దెట్లైన నాయొద్దఁదాఁ
బదివే లింతకు లాగనేర్తు నను దుర్భావంబుచే నైన న
మ్మదిరాక్షీమణి యిట్లు చేసె నని యేమాత్రంబు తద్రామనె
మ్మది నే నీకథనే నెఱుంగఁ గలయేమాన్యుండునుం బల్కునే ?

సీ॥ తాను వలచినదే రంభ తాను మునిఁగి
నదియె గంగ యటంచు బల్కుదురుగాదె !
నాపలుకు లిట్లు కలవో యన్యగతిఁ గలవో
ధీవిశాలురు కాంచినఁ దెలియఁ దొక్క ! 45

మ॥ పతి సౌఖ్యంబె స్వకీయ మంచుఁ బతికై భాగ్యంబుఁ బ్రాణంబు స
మ్మతి నర్పించి నిజేశునందుఁ బరమాత్మన్ గాంచి మోదంబునన్
మతినైర్మల్య మొనర్చి సర్వజనసంభావ్యత్వముం బొందు నా
సతియే కాదె పతివ్రతామణి యశస్సౌభాగ్యముల్ పొల్చెడిన్ !

కం॥ పతిసేవైకప్రాణము
మతినైర్మల్యము స్వధర్మమర్మజ్ఞత సం
పతమోదప్రాదయమును గల
సతి యేమల మందు నైన సన్నుతి కెక్కున్ ! 47

కం॥ లంజలలో సతి యన నీ
కంజానన యనుచుఁ బలుకఁగాఁజన దొక్కొ
రంజన మొందెడువిధు లు
న్నం జేకొన కాశయమున నమ్మి నిలువటన్!

## గృహిణీలం దసతి

మ॥ తన ప్రాణేశ్వరు ప్రాణమై వెలయునాత్మన్ బెండ్లియై యుంటచే
తను హిందూసతి నుంత దో నితరచింతన్ దన్మనఃకాంతు వీ
డ్కొనఁగా నెంచుట యే నసహ్యమగుఁ దైకొంటేన్ దిరస్కారదృ
ష్టినిఁ గొంతేని తటస్థమానె, పతిదో శిక్షించుగా నుండుటన్ !

ఆ॥వె॥ ప్రాణనాథుఁ గాఁగ వనితయుఁ బతికూడ
ప్రాణనాయికగఁ బరస్పరంబు
పలుకుకొనుచు నుంట బాహ్యాసేతువు లెవ్వి
పాయఁ జేయఁగలవె వారిప్రేమ ?

ఉ॥ ఆతనియందుఁ గాంతఁ సతియందు నతిందును సర్వమూర్తినిన్
బ్రీతిని గాంచుటన్ గనరు భీతిని నైహిక మైన యుట్టి శా
ఘాతతి వచ్చినన్ రవియుఁ దత్ప్రిభరీతిని జంద్రిచంద్రికల్
భాతిని నేకమోదమున భాసిలుచుందురు సదాశయంబులన్ 51

చం॥ ఉరుసుఖదాయకం బయినయొక్క యచేతన మంచు భార్య న
శ్వరపతి కాంచఁ డెల్లెడఁ బ్రభన్ వనమానవతన్ స్థిరంబుగా
ధర నెలకొల్ప సాయ మని తత్సతి నెంచెనె, నామె గూడ నీ
శ్వరునిగ నాథు నెంచి యతిసన్నుత యగా భువనత్రయంబునన్

కం॥ సతులు సతీఘనలక్షణ
వతులైరె పురుషాళి పురుష వరసద్గుణసం
యుతులైరె వృద్ధిని గనునెడఁ
బ్రీతిలేని ముదద్ధిఁ దేలుఁ బ్రీతిదేశంబున్ 53

చం॥ ధనము,ఋణమ్ము, దోషమును, దానము, మాన,మగౌరవంబు, నా
స్థను,గృహాలోపముల్,హృదయతాపము, గేహరహస్యముల్,సుమం
త్రిచయమున్ బయల్పఱుపరాని యెఱింగి సతీ పతుల్ సతం
బును వెలయన్ నలెన్ బరులపోఁడిమి నోర్చి సమున్నతస్థితిన్ 54

మ॥ పతిసేవాదుల దాసి, యుక్తులను దెల్పన్ మంత్రినిన్, క్షాంతిలో
క్షితి, విందీయఁగ మాత, రూపున రమన్, శృంగార వేళన్ లస
చ్చతురసాంభవ రంభఁ బోలుచుఁ బతిన్ సౌఖ్యంబులన్ దేల్చి త
త్పతిచే మన్నన లందుచుండుటకదా భాగ్యాత్మ మింపొందెడిన్ ?

చం॥ ఇఁక మన కుండ నెవ్వతె ని రోర్చుటఁ గాంతిము పోవుమాదిరిన్
దనుకునఁ దరిహాస్యతితి దగ్గయుఁదా వెలిసేయు, నామెయే,
స్వాటము గృహంబునం దసతి, పూర్వగఁ దత్పతిజీవితోన్నతిన్
బటుగతిఁ గూల్చఁగా వలఁతిఁ గానుగ యోజనఁ జేసి చూడుఁడీ!

చం॥ తెలియక చేసెనో యిటులు తెల్సి నొసర్చెనో యెట్టులైన నే
బలిసదువాంఛత పట్టినది భాగ్య మదీయరహస్య మీఁగతిన్
వెలి నొసరించి యుంట, గృహిణీఘనధర్మ మటంచుఁ బల్కఁగాఁ
దలమగునొక్కొ యెవ్వరికిఁ ? తద్జ్ఞులు మెత్తురె యిట్టిచేఁతకున్ ?

గీ॥ గృహిణులందున నీపని కేవలంబు
కానిపని యూట నియ్యది గర్హితంబు
సంశయము లేదు కాని యీ సమయమందు
నొక్కవిషయమ్ముఁ జెప్పట యొప్పు నిచట 58

క॥ ఈగతి నవసరమున కిటు
ప్రాగల్భ్యమునన్ వచింపవలసినను నిజం
బే గణియించిన నిటు లను
టాగడ మామక్కు పచ్చలాఁ అనిపడుచున్ 59

మ॥ అదియే యీఁడునఁ బూరుషుండు లవమే నాత్మీయ మస్వంబునుం
మదిలో నారయ లేనివెంగలిగ నున్నన్, లేవు కీయీఁడునన్
బాగలున్ బాధ్యత లెన్నొ, యీమెకును సొంపుంబ్బసంపూర్ణ
మదసింహోపమధీరుఁ డ్రిష్టుఁగలసామర్థ్యంబు దీపించెడిన్, 60

చం॥ అదియునుఁ గాక చౌర్యవిషయు మిన్నటు వేగమువ్యాప్తి నొంద ని
య్యదనను సాయ మయ్యెను మదాజ్ఞను మద్భటగాజి, దానసే
యిది యిటు పాణికి యిక్కరణి నింతలు పుటి చెలంగెఁ గాని యీ
సుదతియె కాదు కేవలము సూటి కత మిన్నట నాయనస్కున్ 61

ఉ॥ పాపము! దైవికంబుగ నవార్యముగా నొకదాని పైని నొం
డీపగిదిన్ బయిం బడుచు నెంతయునున్ గలఁగించుచుంటచే
నాపసికూన జీవితము సంతసము రోసి పరిత్యక్త సూనుసు గా
రీపదపద్మసన్నిధి నురిన్ గొనఁ బోరిచిరి మద్భటావళుల్ 62

ఉ॥ నిత్యమునామె వెన్కఁ గను నెమ్మి మెలంగు మదీయభృత్యుఁడు
సత్యవధానియింట భటసంజ్ఞ మెలంగుచు నొక్కఁ డైన మ
ద్భృత్యుఁడునింకఁ గొందఱునుఁ దీవ్రముగాఁ బడ మోఁది శ్యాములు
భీత్యనుకంపితాత్మ యగు బేలనుఁ బోరిచిరి నాఁటిరాత్రి 63

ఉ॥ కాయముగాయ మొందఁ దలకాయయుఁ గాయలుఁగాయ శ్యాములుం
డాయలతభీతిన్ బఱవ, యీమినిఁ బాలునియింట నుండి వే
సాయము మొనర్పఁ గొంచుఁ జనుమస్త్రాల న్నొక్కఁ బట్టి బిట్టు శా
హాయుతశక్తిఁ గట్టిరి మదాజ్ఞ మెలంగెడు మద్భటావళుల్. 64

గీ॥ ఆభటుఁడె చెలికత్తెల నామె కిచ్చి
జరుగుకథ నెల్ల నామెకు నెఱుకపఱచి
యతులదయఁ బేర్చి తేర్చుచు నలరఁజేసి
రాకగృహంబునఁ జేర్చి యత్యుత్తమగతి. 65

మ॥ అతిరమ్యోత్తమహర్మ్యమందుఁ గన నానాయామినీరామ సం
తతనారీచరణాంబుజాతయుగదత్తాస్వాంతసీమన్ సమం
చితశ్రీరోన్నతసన్నుతామలలసచ్ఛీలాభిరామన్ మహా
చతురప్రాభవభవ్యధామ గతకష్టస్తోమయా లేమనున్ " 66

## సజీవుఁడయ్యుఁ జనియున్న మర్త్యుఁడు

చం॥ ఒకవిషయమ్ము చెప్పుతఱి నొక్కవిధమ్మునవర్ణ మొందుచున్
బ్రకటితలీల మాఱెడిసభాస్థలమందలి మంత్రివక్త్రమ
చ్ఛవికలుఁ బట్టు కాంచుచు ననంతముగా వచియింపఁ జొచ్చె ద
త్సకలము వారు నిస్తులితసంభ్రమమోదములన్ గనుంగొనన్ 67

చం॥ "సరి మనమంత్రి నీరమణిచంద్రుఁడు సేలఁ బవళ్ళు రాజకా
ర్యరగనలందు మున్గుచు ననంతమతిన్ మనుచుండె కాని తా
నపియు నె స్వీయగేహవిషయమ్ము రవంతయుఁ? గాంచి యున్నచో
వరలునె యింతయింతలుగఁ బ్రణమందు గృహంబులోపలన్? 68

చం॥ తనతనయావివాహవిధిఁ దప్పక తాను మనంబుఁ ద్రిప్పి యా
తనఁ బడి నమ్మకమ్ము గలతద్విలక్షణ విషయంబు మోపి త
ద్ఘనులు వచించువానిని బ్రిగా ఘతి నమ్మి వివాహ మెట్లొ యి
ష్టాన నొనరించి క్రిస్తవుగఁ బోయిఁ తిగుల్గొనె రాజకార్యముల్

చం॥ తనదుహితృవ్యథాసుఖవిధమ్ములఁ మాన్పుల, శత్రుతుల్యులౌ
తనదు హితాళిదోహము యథావిధిఁ గాంచమి నేఁటిదుగ్రించిం
తన దుహితన్ సీతనన విధమ్మున మెం డియిపోవ మంత్రి యా
తనఁ దుహినాంశుమాళి విశదస్తుగురీతిని దెల్ప నేర్చెనే. 70

ఉ॥ అల్లునిచౌర్యకార్యవిషయమ్ము చెవిం బడ. నట్లుసేయునే
యల్లుఁ డటంచు సుంత మది నారసి, దుస్థితి గాంచి, పెల్లుసం
ధిల్లెడిముఖ్యకార్యములఁ దీర్చి, కరమ్మునుఁ బ్రోవఁ గష్టమై
తల్లడమొంది, యెంతయును దత్సచివాగ్రణి తెల్లఁబోయెడిన్

ఆ॥వె॥ ఇమ్ము దప్పి వచ్చి యిమ్ము దప్పఁ ఘటిల్ల
వెనుబడంగ నేల వెనుబడంగ
నేల యనుచు ధృతిని నితరకార్యములందు
మనుచు స్థితిగతులనుఁ గనుచు నుండె 72

ఉ॥ ఆతఁడు పాటునొందుతఱిఁ గైకను ముందున రాయతివర్గ మెం
తో తమి నల్లి పేర్చి యిదుష్ప్రాహము ఖేదము సేయ లేక తా
నాతత 'భక్తిఁ జేరి వినయమ్మునఁ బ్రార్థన జేసెనంట భూ
నేతను భూరిసత్త్వపఁ గణించుచుఁ బ్రోవఁగ నల్లు నిత్యమున్ 73

ఉ॥ యామిని యామినీ సమయమందున సత్త్వవిధానిగీమునన్
గోమునఁ జేరుటల్ ద్విజుఁడు కోమలిభంగము నొందుభంగినిన్
వామను వామమార్గమునఁ బ్రాణముఁ దీయఁగఁ బంచు టిప్పు డా
లేమవితాకు లేమయిన లీల నెఱుంగునె మంత్రియిప్పుడున్? 74

శా॥ ఈమీ ధీరమణుండు ధీరమణిమీ రీతి గావించు నో
యామాడ్కిన్ వినఁ గాని ముఖ్యతరకార్యాసక్తుఁడై పోలుఁ దా
నేమాత్రంబును బూర్వమందు వినెనే? మనోజ్ఞప్రయత్నాలయం
దామిత్రాసతి సల్పుచున్నఁ గనెనే యామంత్రిసాయం బటన్ 75

చం॥ తనసుత భావిజీవితవిధంబు నెఱుంగఁగ దాసితోడఁ వి
ప్రునిదరి కేఁగి యుండి గృహమున్ మఱి చేరమి, నామె యప్పుడే
చనెనని యాతఁడంటయును,ఁ జానను గానఁగఁ దాను బూనువం
తను నెఱిగించె మిత్రి యయినన్ సచివుం డిటఁ జిక్కె నీగతిన్

కం॥ అట నాదాసియు మిత్రికు
నటు లాయామిలిని వారియావాసమునం
దటు లొంటరి వీడ్కొని వ
చ్చుటఁ దెల్పదు జనులనిండ సుడివడుభీతిన్ 77

ఉ॥ ఇంతకు నింత యేకమతి నెంతయు వంతల వింత నందు చే
మంత యెదుర్కొనం గలిగెనాసచివాగ్రిణి శత్రుతంత్ర మీ
చింతను వీడి, ? దీని గను చింతను దానిని వీడి యెట్టు లే
జెంతను దా నిరాశఁ గడుఁ జెందు టె కాని నిజమ్ము పల్కుచోన్!

మ॥ అధికారంబుల నూనఁ బోవుతఱి నే చూదర్శముల్ పల్కి ర
వ్విధి వర్తించినఁ గాళ్ల పైఁ బడి ప్రజల్ వేఁ గ్రిమ్మఱం బిల్వరే
యధికారంబుల ముందుఁ బొందుతఱి నేహ్యంబునం బిల్చి ర
వ్విధి ? నెన్నంబడు టన్న నీచత బ్రజన్ వేధించి పార్థించుటే ?

మ॥ వశమే తెల్పఁగ, వీరు వర్గములఁ గూర్పం బెంప నుంపన్ సిరం
కుశతన్ దొల్లిట వారిలబ్ధి కయి చేకొన్నట్టిదుర్మార్గక
ర్కశరీతుల్, తుది నెన్నికల తఱిని వారల్ పొందుకష్టాళి, బా
లిశమార్గంబులు,? ధర్మమే జయసుఖాళిన్ తేచె తద్భావికిన్ 80

మ॥ వడికొంపల్ కడుఁ గాలుచున్నతఱి నార్పన్ బూని బావిన్ బదం
పడి త్రివ్వన్ జను మూర్ఖభాతిఁ దొలి దుర్భావంబులన్ దీప్తిఁగో
ల్పడి, యేలా ప్రజ కంత నెన్నికలవేళన్ మేళ్లఁ జూపింపఁగా !
నడుసుం ద్రొక్కఁగ నేల కాళ్లడుగ నేలా తెల్పి యేపొందుచోన్!

ఆ॥వె। ఇంటిపనుల మాని యింటివ్యాపృతి మాని
నిద్రఁ దిండి మాని నెలవు మాని
మానితయు ధనంబు మాని యెన్నికలందు
నలఁగ నేలఁ దొలుతఁ దెలివి గలుగ ! 82

చం॥ తనదు కుటుంబసౌఖ్యధనధర్మము లెన్నికలన్ దలంగుచున్
మను టది త్యాగశీలమహిమం బగునో, సిరతాధికారలా

భనిచయవృద్ధికై కొను నవార్యదురాశయె యానో, కాంచుఁ డ
య్యనుపమబాధ ధర్మపథమందుఁ గొనన్ జగ మెల్ల మెచ్చదే!

కం॥ అందఱమైత్రినిఁ బొందఁగ
నెం దెటు మాటాడ నెవ్వఁ డెటు లెంచునో యం
చెందునుఁ బొందనిమందులు
నుందురు కొందఱిల వ్యర్థు లురుబాధ్యతలన్ ! 84

చం॥ వలసినరీతి వర్తిలఁ బ్రభావము నేని ప్రయత్నమేని లే
కలసత మూఢతన్ జడత నన్యమనస్కత నున్న యేనరున్
గలిగినఁ గూడ లేనిగతిగాఁ దనదేశమునున్ గుటుంబమున్
దలఁచు, నతండె సూ మ్నతుఁడు తప్పక జీవనమున్న ధారుణిన్ !

చం॥ కృప కలదేని దీనతనుఁ గ్రిందయి కుందెడిదీనపాళిపై
నపరిమితప్రయత్నమున నర్థ సమర్థత లెల్ల నొందున
ట్టిపగిది వారిఁ దేర్చుట కడిందియు మే లగుఁ గాని ముందుగాఁ
జపలత గట్టె వారి కిడఁ జయ్యనఁ గుంటవె రాజ్యచక్రముల్ !

చం॥ అవసర మంచుఁ జేకొనిన నయ్యధికారులగొప్పయైన చ్యాశ
క్తివిరహితత్వమూర్ఖతలఁ గేవల మీ ప్రజలందు, నందె తా
నవిరళలీల మున్నుటను నాగృహమందును,ఁ గల్గి లేని వా
నివలె మెలంగుధీరమణినిన్ బలుకం దగు నున్న లే మిగన్

## ధనోన్నతుడౌఁ నిఱుపేద

ఉ॥ సంపద లెన్ని యున్న జనసంఘములం గడుమైత్రి యున్నఁ దా
నింపుగ వానిఁ బెంపఁ గడుహీనపథమ్ములఁ ద్రొక్కుదుష్టుఁ డౌ
తెంపరి శ్యామలాఖ్యుని విధిన్ మనుచుండుట, పెద్దలున్ సదా
పెంపున వారిస్వార్థ మయి పీనిని వాడుట యెంత గర్హ్యముల్ ?

మ॥ ఇటు లీవర్గము లొక్కదాని నొకఁ డెంతే హెచ్చుఁగా దొప్పలం
పటులై వారలలోన దేశమున దుర్భావంబులన్ బెట్టుఁ బెం !

చుటఁ బోనాడుచు సర్వమర్త్యులు సదా సుజ్ఞానులై దేశ మం
తట సౌభాగ్యముఁ బెంపఁగాఁ దగదె నూత్నంబైనసూత్రింబులన్

మ॥ సతముర్ స్వార్థమె సర్వకర్మములలో సాధింపగాఁ జూచుచున్
తతధీశక్తుల దేశభక్తునిగతిర్ గన్పట్టుదుర్మార్గప
ద్ధతులన్ మానుచు మానవత్వవిమలాదర్శప్రకారంబె యా
దృతి వర్తిల్లుచు వర్థిలర్ వలె జనుల్ దీప్తప్రభాజాలురై 90

శా॥ భోగ్యాహారవిహారసంతతుల బెంపుం జేయఁ బోట్లాడుచున్
యోగ్యంబౌ తమమానవత్వమును మర్త్యుల్ వీడి సౌజన్యమే
మృగ్యంబై చన జంతుపాళివలె నెమ్మిన్ దుష్టతర్ నిల్వ సౌ
భాగ్యం బేక్రియ దేశమొందుఁ, గడు దౌర్భాగ్యంబె కాకెప్పుడుర్।

మ॥ ధన మవ్వారిగ నున్న శ్యామలుఁడు తత్పంగిన్ మహానీచతన్
మనఁగా నేఁటికి వేశ్యవాటికను జీర్ణంబైన వస్త్రాళితో
కననౌ నావిటునొక్కఁడై సగతి భిక్షున్ జేయుచున్ బొట్టకేన్
దినఁగా నేరక హేయ మాపని యొదేనిన్ బైసకై చేయుచున్ 92

మ॥ తినగాఁ దిండికిఁ గట్ట బట్టకు మహార్తిన్ దోఁచుచున్ నల్వూరం
బును మర్యాదయు లేక నిత్యము దరిద్రిండట్లు దైన్యంబుఁ గ
ష్టనికాయంను హైన్యమున్ గడుఘనాశర్ బూనునా శ్యామలుర్
ధనసంయుక్తదరిద్రి డంచుఁ బలుకర్ దప్పేమి? యొప్పెయగుర్

మ॥ ధనమున్ ధార్మికరీతిఁ గూర్పవలె, సత్థానంబులన్ దాని స
ద్వినియోగంబును లీలఁ జేయుచుసుఖాప్తిర్ గ్రాలుచుండన్ వలెర్
దనివిర్ శాంతినిఁ గూర్చు నిర్వ్యధని నిత్యం బిందు నందున్ సుఖం
బును బొందఁగ నకున్న చోఁ గడు వ్యధాపూర్ణంబు తానుర్వియుర్

మ॥ ధనసంపాదన మాత్రహేతు వగుచున్ ధర్మప్రకారప్రవ
ర్తనముర్ వీడఁగఁ జేయువిద్యఁ గని యుద్ధం బాగతిన్ బొందుటే
ఘనసామర్థ్యముగాఁ దలంచుశఠుఁ డెక్కాలంబునన్ వేరుపు
ర్వ నిజం బెంచఁ గ దేశభద్రితకు సంపూజ్యప్రభావాప్తికిన్

మ॥ భగవద్గీతయు దైవభక్తియుఁ బ్రజావర్గంబులం దెల్లెడన్.
మిగులన్ వ్యాప్తములయ్యె, మోసమె యెటన్ విస్తారమై మిన్నుము
ట్టెఁగడున్ వర్తనమందదేమొ ఖలమై డిందన్ బ్రపంచేద్ధశాం
తి! గభీరాత్ములు మేల్కొనన్ వలెఁ గడున్ వే మేల్కొనన్ మేదినిన్

## పాండితీరంజనఁ గాలు కించుపసరమ్ము

శా॥ విద్యావంతులు విత్తవంతులును సంవేద్యార్థమే నాఁడు తా
రాద్యంతంబు నెఱింగి వర్తిలుచు హృద్యస్వార్తి బోధింపరో
చోద్యం బొప్పఁగ నీజగంబు నశియించున్ నాఁడె ప్రోద్యద్ఘనా
విద్యాధ్వాంతసమావృతం బగుచు విద్వేషాలవాలంబునై 79

మ॥ మనయీసత్యవధాని యన్నిటను శుంభత్పండితుం డయ్యు నా
తనిదృష్టిన్ బొనరింపరాని యొకకృత్యం బున్నదే? పూనకుం
డినయేదుర్గుణముల్ గనంబడునె? దుర్నీతిప్రభాపూర్ణుఁ డీ
తనితుల్యున్ గననేర్తుమే శఠుని హార్దన్ గోముఖవ్యాఘ్రమున్!

చం॥ ఎడపక వేయిరూకలకు నెన్నొ యసత్యము లాడి యామినిన్
నడిఁ గొనఁజేసె నన్నుఁ గడు నమ్మిక దాఁచిన రెండు వేలనున్
జడియక దొంగిలించె, గురునమ్రితఁ జేరినబాలశీల మ
ట్టడఁపఁగఁ బూని సాగమి లతాంగిని హత్యనుఁ జేయ నంపెడిన్ 99

మ॥ భగవత్తత్త్వముఁ గాంచఁ జేయఁగల యద్వైతప్రభావంబునం
దు గభీరుం డయి యన్యశాస్త్రములనెందున్ నేర్వ నానందమున్
జగమున్ దానునుఁ బొందుఁగాని, యితరుల్ శాస్త్రంబులన్ నేర్చుకొం
ట గుఱిన్ నేర్వనివాఁడు కత్తిఁ గొన్నట్లై నాశంబె కల్గించెడిన్ 100

చం॥ ధన మెటు వచ్చు నాగతిని ధార్మికబోధన లేని మార్చుచున్
దన కెటు లాభ మబ్బు నని నమ్మినొ తద్గతి సంచరించి య
మ్మనుగడయే ఘనమ్మని సమర్థనఁ జేసెడి నాయకుల్ కవుల్
ఘనులు నెసంగ నేగతినిఁ గాంచు మతమ్మును దేశ మున్నతిన్

శా॥ ఘోరవ్యాధులతో జగద్వ్యథలఁ జీకున్ గూర్చు దుష్టక్రిమిన్
ధీరోదాత్తుఁడుఁగా గనంబడుచు నా తెల్విన్ గుమార్గాదిసం
చారాళిన్ మని తత్సమర్థనల నిచ్చున్ వాఁడు నీచాత్మునిన్
స్ఫారప్రజ్ఞ మెయిన్ బ్రభుత్వములు మచ్చున్ మాపు చుండన్ వలెన్

కం॥ ఛందముల నేర్చి ఖలబుధుఁ
డందలిసారంబుఁ గనక హానిదుఁడు నగున్
చందనము మోయు గాడిద
యందలివిలువను గ్రహింప కఱచెడిభంగిన్ 103

కం॥ అజ్ఞునికంటెను నీచత
విజ్ఞుఁడు వర్తించు నెడల విజ్ఞానఫలం
బజ్ఞేయము నన్యాయము
సుజ్ఞానావశ్యకతయు సుడిసి నశించున్ 104

శా॥ నీచుండైన మను పండితున్ పశు వనన్ విన్నంత నే యుల్కుచున్
నీచత్వంబునుఁ బూని యాపశువు గ్లానిన్ జెందునప్పోల్కి, కెం
దే చాయన్ దన ధర్మమును దలఁగ కెంతేఁ గ్రాలు నద్దాని సం
కోచం బందక ధర్మహీననరుతోఁ గూర్మిన్ సరింబోల్చుటన్ 105

గీ॥ ఎలమిఁ బండితపశువుగా నెన్ను టర్హ
మిలను సత్యావధాని నెన్నని గతుల
విజ్ఞుఁడైన నీచత మెలంగువీనివలనఁ
గాక గీడేమి భువికి నజ్ఞానివలనఁ ? 106

## సభన్ బిఱుఁదొందు వేపి

ఉ॥ రాజసభాంతరాళముల రాణఁ దలిర్పఁగ గౌరవాదులన్
రాజితలీల నందు కవినాయక పండితులున్ నియోగితుల్
బూజగ నేగుణంబులకుఁ బొందుదురో సభలందుఁ దద్గుణ
భ్రాజితులైన సమస్త విధవర్తనలందు నెసంగు టొప్పగున్ 107

శా॥ నేతృత్వంబునుఁ బొందినంతనె కడున్ వేధించు రొమ్మెక్కియె
న్నో తెయ్ తక్కల భూరమాధికరణాద్యుత్కామినుల్ కాని సం
పూతుండౌ విమలోన్నతిన్ వెలయు సంపూర్ణాత్మ విజ్ఞాని వి
ఖ్యాతిన్ మాధవులీలఁ, గ్రిందయివిపాస్యశ్రేణి నల్గన్ గడున్ 108

కం॥ మా పతి పాప్రున లచ్చియె
యేపున ఘన గౌరవమున నెసఁగెడుఁగాక
ట్లోపును లక్ష్మీ(మ)దాసుం
డీపగిదిన్ లోక మేల నిద్ధ విమలతన్! 113

శా॥ ఈ యుద్యోగులు ధర్మమార్గముల నెంతే భంగ మొందించు రా
ష్ట్రీయున్నారన, గాళ్ళొక్కతటి జంత్వానీక కండూతినిన్
ఛాయంజేసెడి, నవ్విపై బడిననే ఛాధించెడింగాని వీ
రో యన్యాపకృతి ప్రవీణులును గర్వోన్మత్తులున్ మత్తులున్!

శా॥ ఉద్యోగంబుల హెచ్చుజీతముల మర్త్యాల్ పొందుచుంగూడ నే
సద్యోలాభమొ యెంచి లంచముల నిచ్చన్ బొంది పేరాసమై
నుద్యోగంబుల జేయరానిపను లెన్నో చేయుచున్ ద్రోహులై
చోద్యంబొప్పఁగదొంగహాసముల హెచ్చన్గాం(త్రు)వారే సభన్

మ॥ మిగులన్ బాధ్యతఁ బాలనంబు సలుపన్ మేకొన్నయుద్యోగి భూ
రిగభీరత్వము విద్యయున్ క్షమయు సంతృప్తిన్ వివేకంబు నే
ర్పుఁ గడున్ గల్గి బలోత్సుకప్రభల నింపుం బెంపు లే కున్నచో
జగమున్ దానును రాజ్యచక్రమును ధ్వంసం బౌఁ (గ)మక్షీణతన్

మ॥ ఉడునాథుండు దినేశునొద్దఁ గడుఁ గాంత్యుష్ణాదులన్ గొంచుఁ దా
నిడు మర్త్యాళికి శైత్యకామముఖమా నేవో కొన్ని యారీతిగా
నొడయం డేయవకాశ మిచ్చు నవియే యుద్యోగి మర్త్యాళికై
యిడ కన్యం బిడి భీతిధుం డగుచు నెన్నో లంచముల్ లాగెడిన్

చం॥ కపటిగ నెన్నొ లంచములఁ గాంచి ప్రజాళికి తేని కైన ద్రో
హపుగతి నెందు వర్తిలి ధనార్జనసేయుచు సిగ్గులేక బి

ట్టపయశ మంచు నెంచక సభాంతరమందుఁ బ్రజాళియందు మ
ర్త్యాపగిది సంచరించుఁగదయూర నియోజితుఁ డెంత మొండియో!

మ॥ నను బంధించుభటాళి మాధురికడన్ లంచంబు వే లంచుచున్
నను వీడ్కొంచుఁ దలంగి వచ్చి రిట, నే నల్యోప్పఁగా జాఱుచో
గనలే మైతిమి చోరు నంచు నిచటన్ గల్లల్ కడున్ బల్కెరే!
ఘనవిద్రోహులు తేనికిం బ్రజల కెక్కాలాన నీదృగ్భటుల్!

శా॥ ఆయుద్యోగులు నేను ద్రోహి నని బ్రహ్మాండంబులన్ వ్రీల్చునె
న్నే యత్నంబుల నాదు నేరమును నెం తేఁ బెంచి యీ తేనిచే
నీయాజ్ఞప్తి నొసంగఁ జేసిరిగదా యీ మంత్రిపై నీర్ష్యచే!
హాయిన్ గూర్చెడి కల్ల హాసముల లేరా వార లి ప్డీసభన్! 116

మ॥ శునకం బెంతయు నీచమౌ గుణతతిన్ జూపట్టినంగూడ నెం
దును విశ్వాసమునందుఁ బేర్వాడుఁ గదా! ద్రోహుల నన్నింటిలో
మనుజుల్ నేఁ డిటఁ ద్రోఁకలన్ ముడుచు నిమ్మర్త్యాళి కేతత్సభన్
శునకౌపమ్యముఁగూర్పనామనమునొచ్చున్ హెచ్చుతచ్చింతనన్

## గద్దెంజరియించు గార్దభము

మ॥ నరనాథుండు స్వకీయరాజ్యమున నన్యం బైన రాజ్యంబునన్
జనుగం బోయెడివానినిన్ జరుగుకర్జంబున్ గనంగావలెన్
నరచారోత్కరచక్షువై, యటులు కానన్ లేనిమంత్రిప్రభుల్
ధర భంగంబుల నొందుచుందురు వ్యథాధారాపరీకంపాత్ములై

మ॥ తనచుట్టుం గలమర్త్యాలం దెవనిస్వాంతం బెట్టిదో, యెవ్వఁ డె
ట్టి నిదానంబున నుండువాఁడొ, యెవఁ డేతేవన్ వచింపంగనే
ర్చునొ చక్కంగనువాఁడె ఱేఁడు; పరుఁ డేరూపంబునన్ మోసగిం
చునొ యారీతినిమోసమొందు నతఁడే సూ, మ్రోడు ధాత్రీస్థలిన్

శా॥ ఏ దేశంబున నెట్టికాలమున నేయేరీతు లర్థ్యంబులో
యా దేశంబున నట్టికాలముల నాయాధర్మరీతిప్రభో

థాదుల్ సేయక కేవలంబు పరదేశానీకధర్మాను కా
రాదుల్ చేసిన నెట్లు దేశమున శాంత్యానందముల్ నిల్చెడిన్ ?

కం॥ కనవలె ననేక రీతులఁ
దన యధికృతితో నెసంగు తత్తద్గతులన్
దనవా రని నమ్మొటమై
నను నమ్మమి తోఁచుటయును నరపతికిడుమల్ 121

మ॥ కర ముద్యోగులు నమ్మియుండఁ దగి దక్షత్వంబు పాల్పొంద నే
ర్పరు లాధీరుల గూఢచారుల గ్రహింపం గల్గి వేర్వేఱ నె
ల్లరు సత్యస్థితులన్ గ్రహించుకొని తెల్పన్ జేఁడు వారాళిచే
వరధీశక్తిని సత్యశోధనము సల్పన్ లేమిఁ గీడే యగున్ 122

మ॥ ప్రజలం దేయొకవంత తోఁచినను దద్బాధన్ స్వకీయంబుగా
సుజనస్తుత్యనృపాలుఁ డెంచి వడిఁ బో జూచుక్ బ్రయత్నంబులన్
నిజకారుణ్యముచేతఁ బ్రేమను జనానీకాత్మరాజ్యంబు నే
లు జయాఢ్యుం డయి, కేవలాసినిబ్రజన్ లోఁగొన్నఁడా నిల్చునే!

మ॥ దశశీర్షామలవాగ్విభాకలితుఁడై తద్వేదశీర్షప్రస
క్తిశుభత్వం బది లేమి రావణుఁడు ధాత్రిక్ లోకవిద్రావణా
యశమున్ బొంది నశించెఁ గావున వివేకానందదంబైన వే
దశిరోబోధితమార్గముం గనక వంతన్ దీఱునే యారికిన్ ? 125

చం॥ మనుజుల యందునైక్యతయు మంజులతక్ సువివేకముక్ శమం
బనుపమలీలఁ బెంపఁగలఁ యాగమశీర్షప థంబు జొచ్చుచో
ఘనతరమౌ సమస్యలు వికావికలై సన గాఁ బ్రిమోదవా
ర్ధిని జన మెల్లఁ దేలరొకొ ప్రేమరసైక విభాపరిపూర్ణులై !125

మ॥ సరిగా వర్తిలుమంచి చెష్టలనుఁగాంచం గల్గి స్వార్థంబు లే
కురుమర్యాదల స్వీయధర్మముల నెంతో శ్రద్ధ వర్తింప కి
ద్ధరణిక్ సంతకముల్. బొనర్పగలమంత్రంబట్టు లుద్యోగులున్
నరనాథుల్ మనుచున్న శాంతియెటు కానక్ వచ్చు వంతల్ వినా?

ఉ॥ వర్గము లెన్ని యున్న జనవారము మోదముఁ జెందుశత్రులన్
నిగ్రహముం బొనర్చుచు వినిర్మలరీతి నెసంగి దుష్టసం
సర్గము లేక స్వీయవిధిఁ జాగి పరస్పరవృద్ధిఁ గోరుచో
స్వర్గమె య్యై మహీతలము భాసిలదొక్కొ ప్రమోదధామమై ! 127

మ॥ వినుఁడే నామతిమంతుపుత్రుఁడఁ బురిన్ వీడ్కొంచు నిక్కార్య మిం
దున సాధింపఁగ వచ్చి యుంటి నిటు లిందున్ వాడ మారాణి తా
ల్చునగల్ దెచ్చితి, నెంచురీతిగఁ బనుల్ పూర్ణంబుగా నయ్యె దై
వనియోగంబున, నెంచి చూడు మిట భూపా! కీడుమే ల్కొందునన్

శా॥ ఏరీతిన్ భవదీయసౌధమున కే నేతెంచి యే మేమి నే
నీరీతిన్ గొనిపోవఁ గల్గితినొ లో నింతేని యూహింపకే
మీ రుద్యోగులు చూపుపత్త్రముల నెమ్మిన్ నమ్మి శిక్షింతు, రీ
ఘోరం బాగతి నెంద జొందిరొ వితాకున్ మీ యనాలోచనన్ ?

కం॥ నాఁ డట మీ రడిగిన యా
యేడవయంశమున బదులు నే వచియింపన్
నేఁ డిట నవసర మనుకొన
జాడలు తెలియంగ నగుటఁ జక్కనెఱిగినన్. 130

మ॥ వరమౌనీంద్రనుతప్రపూతపథభాస్వచ్చారి వీరేంద్రకే
సరి ముద్రం బడి నా కొసంగఁబడు నాజ్ఞాపత్త్రముల్ కాంచు మో
ధరణీనాయక! ఈసభాస్థలిని మద్రక్షార్థమై లక్షలుం
డిరి మత్సైనికు లన్యవేషముల మన్నాజ్ఞఁ బాలింపఁగన్" 131

## అభినందనము.

మ॥ కడు నిశ్శబ్దముగా నియుక్తగతిఁ దైక్ష్ణ్యం బుప్పతిల్లన్ నిలం
బడి శాతాయుధహస్తు లెందఱొ సభామధ్యంబునం, దంత నే
వడిఁ గూర్చుండిరి, నాటకంబువలె జస్వంతుండు నేతత్ప్రజల్
పడ దిగ్భ్రాంతి నశాంతి నుంతయు సభాభాగంబునన్ దోపమిన్

మ॥ అతినిర్విణ్ణగతిన్ సభాసదులు తేఁ డాకాంక్ష నీక్షించి రు
ద్ధృతవీరేంద్ర హరీంద్రదత్త విలసల్లేఖాలలామున్ మహో
ద్ధతసంవర్ధననాము సద్ద్విజకులోద్దామున్ యశఃకాము సం
స్తుతవిద్యాగుణధాము నిస్తులిత సద్రూపప్రభారామునిన్. 133

శా॥ ఆ నిశ్శబ్దము భంగ మొందగ మహోద్యత్ప్రేమ జస్వాంత పృ
థ్వీనాథుండు వచించె మంత్రిసుతు తెల్విన్ మెచ్చుచున్ దండ్రి నెం
తేనిన్ మించఁగఁ జాలు ధీవిపులుఁ డం చీరీతి సుస్వల్పకా
లానర్ వింతగ నింత చిత్రకథ లీలన్ వ్రాలం జేయుటన్. 134

శా॥ "నే రూపింపఁగఁ గోరియున్న విషయానీకంబు రామాపురిన్
ధారాళంబుగ నుంట వింట, నవి తద్రాజన్య చిత్తంబునన్
దేరం గోరియె యట్లు వ్రాసితిమి, యీదృగ్భంగి వర్తిల్లె, నే
నారాజ్యంబునఁ దెల్పగోరినవి వ్యాఖ్యానింతు మీరల్ వినన్ 135

మ॥ అతిసౌందర్యరమాలలాము యగు వారా[illegible] ననన్ గూడ ను
ద్ధతలీలన్ బురమధ్యమందుఁ గలసౌధంబందుఁ దా నొక్కఁడే
మతిమంతుం డెపు డేఁగుచుండునఁట, భామారత్న మా వేశ్య యే
యితరున్ [illegible] కొన, దామె యే యుసతులం ది[illegible]లు యోజించిన[illegible]

మ॥ మతిమంతుర్ ధృతిమంతు నెమ్మదిని నమ్మం [illegible] నమ్మెడినీ
పతి యుష్మత్పత్రిని సర్వవేళలను దద్వాక్యాన్మృతాస్వాదనా
రతిన్నె స్వీయగృహంబునం దునుపఁ దద్రాజ్ఞ[illegible]కరిమ్మున్న గర
[illegible]తఁ బొందంగనియుండుటన్, గులట [illegible] యిల్లాండ్రలో[illegible]

మ॥ నృపుకంటెన్ గల రాజ్యకార్యముల నన్నింటన్ మహామంత్రియే
యుపయుక్తుండయిన ద్రవ్య విభుఁడునయ్యు[illegible] భోక్తయైయుండుటన్
విపరీతంబె యనామకుం డయినజేనిన్ మన్న లేకున్న య
ల్లుపమింపన్ గడుఁ గీలుబొమ్మగ నతం డుంటన్ మహామంత్రికిన్!

శా॥ కాంతాస్యందన చందనాస్తుహితభాగ్యం బంత యాజేని దం
చెం తేఁ జొక్కి సుఖించు ధీయుతుఁడు మంత్రీంద్రుండున్నై యుంటచే

సుంతే జంకఁగ నేల వి_త్తయుతుఁడై చూపట్టినన్ బేదయాఁ
జింతింపన్ నృపుఁ డన్న, నున్న, విభవశ్రీభో_క్త కా కుంటచేన్! 139

ఉ|| భాసురపాండితీగరిమ భవ్యమతి ప్రతిభావిభూతి గా
ర్యాసమనైపుణీపటిమ నన్నిట మిన్నగ వన్నెఁ గన్నవాఁ
డాసచివుండు నమ్మిన ధరాధిపు మోసముఁ జేసి తత్సతిన్
వాసిగఁ గొన్న వేసడముఁ బండితకాసర మన్న దోసమే ? 140

చం|| తగులుచు నీచకార్యముల దాని నెవండు నెఱుంగ రంచు నేఁ
దగుదు నటంచు నగ్ర మగుస్థానమునన్ సభయందుఁ బొంది య
వ్వగ నటు నిర్వటించుసచివప్రవరున్ సభయందుఁ బొల్పు వే
పిగ ననరాదె, నీచుఁ డయి విమలస్థానము నాక్రమించుటన్! 141

చం|| తనగృహమందు రాజ్యమునఁ దక్కయు వర్తిలుచున్న దేని నెం
చనుఁ గన దిద్దలేక కడుఁ జక్కఁగ గడెను గ్రోలుచుండు నా
ఘనస్నృపు గట్టిఁ గ్రోలు నొకగాడిదగా వచియింపఁ బోలదే !
యనుపమ రాజ్యమున్ పడుట నష్టలు గడెను లేమి యెందులన్!

మ|| ఎకసక్కెమ్ముగ నిర్వి తెల్పుటను నే కీర్తి నానాఁడు లే
ఖకనున్ వ్రాసితి, నొక్కచిత్రకథ యు బన్ని సంవర్ధనం
బొక రీతి దెలివిని నిరూపణము సేయున్ దీసి, నీరెంటిలో
బ్రకటం బౌగితిఁ గాంచఁగా సగుపు వ్యాం జేవొ మీరెల్లరున్"

కం|| అని జన్యంబులం బేనుంయుఁ
గని సంవర్థనుఁ డమేయగౌరవమున ని
ట్లని బదులు పలుకఁ దొడఁగెను
కని సభ్యులు వింత నందఁ గౌతుక మెసఁగన్. 144

శా|| "ఆసౌధంబున నున్న లేమ విషకన్యన్ గూర్చి యీభూపుఁ డిం
దీసౌ రొప్ప వచించు చున్న, దతఁ డెన్నేమాఱు ల న్నేఁగుఁ దా
నాసౌధంబున కెందు కేని, బురమధ్యంబందునం గ్రాలు నే
యాసౌధం బది మంత్రి వేశ్య యగుచో నారీతి! నూహింపుఁడీ!145

శా॥ దిక్చక్రమ్ములనద్వితీయగతి దీ_క్ గాంచు విజ్ఞానమున్
వాక్చాతుర్యము శాస్త్రపాండితియు దివ్యప్రయుక్ బ్రౌఢస
మ్యక్చింతన్ గలనాదుతండ్రిపయి నీర్ష్యన్ గాక యెట్లొప్పు నీ
దృక్చండప్రవిమర్శనంబు, నిజమున్ దెల్పన్ గనం గోరు దోన్ !146

గీ॥ ఇట్టి యీర్ష్యాజనిత మైనవట్టిదుష్ట
వార్త మీఁదనే యాధారవడును కాఁచు!
యన్యవిషయంబు లెల్ల బి ట్టరసి చూడు!"
ననుచు లీలగ్ను ఖండించె నవ్విబుధుఁడు.

ఉ॥ "మీరలు కోరి యుండినవి నేమునమంజసతిఁ జూపఁగా
నేరక, చేరి, మేము మిము నెమ్మని జూపఁగఁ గోరుకొన్నచో
మీరలు వానిఁ దెల్పగఁ దమిన్ జతనం బొనరింప భావ్య మో
సారవిచారధీర ! సువిశాలగభీరమనోబ్ధిభాస్వరా! 147

మ॥ అమితం బౌ తనరాజభక్తి నతులంబౌ దేశభక్తిన్ స్వగే
హము దేహమ్మును లెక్కసేయని మహాత్యాగంబునన్ శత్రువ
ర్గము స్థానంబుఁ గొనంగఁ బన్నడికుతంత్రశ్రేణినిన్ జీల్పయ
త్నముల౯ మున్గు గభీరు ధీరమణికిన్ మద్వందనస్తోమముల్ 148

మ॥ కడు మోమోటమి నాదినుండియు స్వవర్గంబందు నుద్యోగ మి
చ్చెడివో నీచుల శక్తిహీనతతిని౯ జేర్పించి యుంట౯ గదుం
గడుఁ గష్టంబయి స్వీయరక్షణపరాక్రాంతిప్రతీకారముల్
కడగండ్లన్ గడుఁ బొంది యుండిరి బుభూకాంతుండు దన్మంత్రియు౯

ఉ॥ ధర్మపథంబున౯ జయముఁ దారొకొన లేనిజనంబు లాశగ్ను
ధర్మము వీడి యన్యుల నధఃకరణం బొనరింపఁ గోరి యే
కర్మము లేనివారి బలిగాఁ గొని యున్నతి నొందఁ గోరి దు
ష్కర్మముఁ బూని ధూర్తులయి కారియఁబెట్టుదు రెల్లదేశముల౯

చ॥ అపజయశంకం దీ, యున్నబల మంతయుఁ గోల్పడియున్న వైరితో
నపరిమితంపుదౌష్ట్యమున దుర్యాక్తికమార్గము చే నెదుర్చునవ

ర్గపువడి నాఁపనోపఁ గడుఁ గష్టము నొందెదుమంత్రి తేననే
నిపు డుపయుక్త మీఁగతిని నింత యొనర్చుటఁ జింత యయ్యెడిన్

గీ॥ ఒక రొకరియున్నతిని జూచి యోర్వలేక
యొక రొకరిఁ గ్రిందు చేయఁగా నూని యిట్లు
హీనగతి నెల్ల రుంటచే నిట్లు నేను
జయము నొందితి లేనిచో శక్య మగునె ? 153

ఉ॥ ఏరికి వారు ధర్మగతి నెంతయు నిల్చి పరస్పరోన్నత
స్ఫారమతిన్ స్వదేశఘనభాగ్యవివర్ధనకారు లైనచో
నేరికి దుర్నిరీక్ష్యగతి నెంతయు దేశము వన్నె కెక్కు దు
ర్వారపరాక్రమోగ్రబలభాసురమై కడు నగ్రగణ్యమై 154

శా॥ చింతింపన్ బ్రభునాజ్ఞయున్ జనకునాశీర్వాదమున్ రుక్మిణీ
కాంతామేయ కృపాకటాక్షము మహోగ్రం బలంబీయ నే
నింతల్ చేయఁగ వీలుగాఁ జెనదిగా కేనంతశక్తుండనే !
పంతం బూనకుఁ డేనవార్యగతి సల్పన్ బూనునాచేష్టలన్ 155

చం॥ అని క్షణ మూరకుండిన సభాంతర మందలి మర్త్యులందు స్తో
త్రనినద మప్రమేయజయరావము భూమినభోంతరంబు నిం
డ, నతులరక్తి నానృపుఁడు నవ్యసుమంబుల మాలచేత నా
తనిఁ గడు గౌరవించెను ముదంబున నెల్లరు మేర మీఱఁగన్ 156

కం॥ బహువిధపక్షములందలి
మహితులు సంవర్ధనుని సమంజసవిద్యా
మహిమకు మోహితులై హిత
విహితముదాఁ బొగడి రతని వేనోళ్ల సభన్ 157

గీ॥ నరపతియు వివిధప్రజానాయకులును
హితము ప్రియమునుఁ దనర వీరేంద్ర కేస

రికి లిఖించిరి చిన్న లేఖక నొకండు
నుభయమైత్రియుఁ జిరకాల మొప్పరీతి 158

శా॥ తద్విద్వద్విభవమ్ముఁ దద్విమలతేన్ దద్ధర్మమన్మజ్ఞతల్
దద్విఖ్యాతవచో విలాసరుచి నేతిచ్చాతురీరీతులల్
ద్వద్వైశద్యము నొంది యెల్లరనుఁ దద్దన్ దిక్కుకోఁ బెద్ద లే
తద్వారిష్ఠుని నుంపఁ గోరి రొకయప్పుం బచ్చటల్ లేఖకల్ 146

మ॥ తతదీప్తిల్ గొని యేఁగె రామపురి కేతన్మంత్రి, రాజాజ్ఞ, ను
ద్ధతమా వైభవ మొప్పఁ గానుకలతోఁ దద్యామినీమాధురీ
యుతు విద్యాన్వితు సద్యశఃకలితు భవ్యోల్లాససంపూతు న
మ్మతిమన్మంత్రిసుతున్ బ్రియాసహితు సమ్యక్సద్గుణవ్రాతునిల్

## మంగళమహాశ్రీ

శ్రీనగభవాధిప ప్రీతి ప్రాసరసీరుహావిశేషతరిమోచకరనాకూ !
దీనజనపాల పరిదీప్తగుణజాల మునిదేవగణాంగోల రణభీమా!
మానిజనకీర్తిత సమస్తవిధసద్గుణ సమగ్రచరితాన్వితలలామా !
భానుకులతేజ శ్రీశపాళిసురభూజ జనరంజకప రాజ వస్తు నామా!

ఇది శ్రీరామానుకంపాకటాక్షులగు కవితార్క రేయ ండిన్య
గోత్రపవిత్ర విప్రకులాలంకారశ్రీముత్యవంశజయశపారా
వారరాకాసుధానిలయ శ్రీకామేశ్వరాంబా
సూర్యనారాయణ గుణ గేయ తనయ
విబుధవిధేయ శ్రీసుబ్బరాయప్రణీత
సంవర్ధననామకావ్య తృతీయ
సముల్లాసము సర్వశ్వము
సంపూర్ణము.

## తప్పొప్పుల పట్టిక,

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| (1) | 9 | సమంజసలు | సమంజసము |
| (2) | 5 | భేషా | దేషా |
| (2) | 10 | ధేర్చు | దేర్చు |
| (2) | 11 | శక్తి | సక్తి |
| (2) | 15 | నీక్కైయిత | శోభిల్లునీక్కైత |
| (2) | 16 | గ్రిసీ | గ్రిణీ! |
| (3) | 2 | గన్యము | గమ్యము |
| (3) | 3 | తుతి | తుది |
| (3) | 6 | దివ్వొ | దివ్యో |
| (3) | 12 | లఘు | లగు |
| (8) | 22 | విమర | విమల |
| (9) | 5 | బ్రాంత | భ్రాంత |
| (12) | 5 | భృసం | భృశం |
| (13) | 3 | ద్యపాప్తి | ద్యుతాప్తి |
| (14) | 15 | సప్ప | సత్ప |
| (15) | 8 | దావాహ్ని | దావహ్ని |
| (16) | 3 | మనసును | మనస్తను |
| (16) | 16 | గరిమ | గరిష్ఠుం |
| ,, | 20 | మహార్త | మహాత్త |
| ,, | 22 | లాతగన్ | లైతగన్ |
| (17) | 3 | నిషతర్థ | నిషదర్థ |
| ,, | 17 | హృనయా | హృదయా |
| (18) | 3 | గుప్రిల | ఘృణిన |
| ,, | 7 | ద్గనినీ | ద్గతినిన్ |
| 3 | 5 | తత్ర్థలుల | తత్స్థలుల |
| ,, | 6 | కక్షణ | కర్షణ |
| 13 | 2 | బాజితు | భ్రాజితు |
| 17 | 2 | బనుచు | బనుచున్ |
| 21 | 21 | పొల్సు | పొల్చు |

| | | | |
|---|---|---|---|
| 24 | 10 | కర్కస్సుడై | |
| 25 | 2 | ప్రిబోధ | ప్రబ |
| 26 | 6 | పజ్ఞ | పజ్జ |
| 28 | 17 | దృరదృష్ట | దురదృష్ట |
| 31 | 23 | పైతృత | పైతృక |
| 35 | 6 | తదు స్థుల | తదు క్థుల |
| 38 | 8 | గెఱచి | దెఱచి |
| 45 | 17 | వి:పొంక | లింపొంద |
| 46 | 18 | నసియు | నవియు |
| 47 | 1 | మెన్ను | మిన్ను |
| 49 | 13 | న్నియు | ఇన్నియు |
| ,, | 14 | ట్రిదుట | కట్టెదుట |
| 52 | 3 | పత | తత |
| 54 | 11 | పుటి | పుట్టి |
| 56 | 9 | నరాయతి | నరాతి |
| 59 | 17 | కాయంను | కాయంబును |
| 61 | 2 | తెల్విన్ | తెవ్విన్ |
| ,, | 10 | జ్ఞాన | జ్ఞాన |
| ,, | 16 | బోచ్నుట | బోల్చుట |
| 62 | 10 | జంతానీక | జీనానీక |
| ,, | 18 | గభీరత్వము | గభీరత్వము |
| ,, | 24 | భీతిధుండు | భీతిదుండు |
| 63 | 4 | నల్వాత్వ | నల్వావ్వ |
| 66 | 8 | లానర్ | లానక |
| ,, | 26 | మంత్రీంధుడు | మంత్రీందుడు |
| 68 | 10 | వెమ్మని | నెమ్మది |
| 69 | 12 | గ్రంబలం | గ్రంబాబలం |
| ,, | 22 | డాబాగడి | గాబాగడి |
| 70 | 3 | మన్మజ్ఞ | మర్మజ్ఞ |
| ,, | 10 | పన్మందిర | మన్మంతిర |